శ్రీమతే రామానుజాయనమః





# శ్రీవైష్ణవ శ్రాద్ధ ప్రయోగము

## బ్రహ్మార్పణ విధానము

శాస్త్రవిద్వన్మణి, మధురోపన్యాసక
శ్రీ ఉ.వే.శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్యులు గారిచే విరచితం

శ్రీరామానుజార్య దివ్యాజ్ఞాం వర్ధతా మభివర్ధతామ్

ప్రకాశకులు:
శ్రీమాన్ కాండూరి శ్రీనివాసాచార్యులు (ఫోన్:8501816066) - శ్రీమతి కృష్ణవేణి
శ్రీమాన్ కాండూరి నరసింహాచార్యులు (ఫోన్:9030050329) - శ్రీమతి మధుమతి

శ్రీమతే రామానుజాయనమః







శాస్త్రవిద్వన్మణి, మధురోపన్యాసక
శ్రీ ఉ.వే.శ్రీమాన్ అమరవాది వేంకట
నరసింహాచార్యులు గారు

## ముందుమాట

శ్రీవైష్ణవ బంధువులారా...

జన్మించిన వ్యక్తి 3 ఋణాలతో ఉంటాడు. దేవఋణం, ఋషిఋణం, పితృఋణం. ఈ ఋణత్రయం నుండి విడివడిన పిదపనే మోక్షం గురించి ప్రయత్నించాలని ఆర్యోక్తి.

ఋణాని త్రీణ్య పాకృత్య మనో మోక్షే నివేదయేత్
అనపాకృత్య మోక్షంతు సేవ్యమానః పతత్యధః

ఋణవిముక్తి కలుగనిదే మోక్షం సిద్ధింపదు. ప్రయత్నం చేసినా అధఃపతన హేతువని తాత్పర్యము.

దేవఋణం యజ్ఞ దాన తర్పణాదుల ద్వారా తీర్చుకోవాలి. ఋషిప్రోక్తమైన నిత్య, నైమిత్తిక కర్మల ద్వారా ఋషుల ఋణము, తల్లిదండ్రులను సేవించి మరణానంతర కృత్యం, ప్రతి సంవత్సరం శ్రాద్ధం చేయడం ద్వారా పితృఋణం తీరుతుందంటారు.-

ఇక్కడ పితరులు అనగా తల్లి తండ్రి అని అర్థం. 'మాతాచ పితాచ పితరౌ' అని శాస్త్రము.

జీవతో వాక్యనిర్వాహాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్
గయాయాం పిండ దానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా!!

జీవించి ఉన్నపుడు వారి ఆజ్ఞలను పాలించి సేవించడం, మరణించిన పిదప ప్రేతకృత్యం నిర్వర్తించి, ప్రతి సంవత్సరం వారి స్మరణ పూర్వకంగా పితరుల నారాధించి, గయాశ్రాద్ధం ఆచరించాలి. ఈ మూడింటిచే పుత్రుడు అనబడతాడు.

ప్రస్తుత కాలంలో మనం వీటిని ఆచరించుచున్నాము అయితే ప్రతి సంవత్సరం శ్రాద్ధం జరుపుకొనునప్పుడు మనకు కొన్ని ఇబ్బందులు కలుగుచున్నవి. సరియైన భోక్తలు లభించకుండుట, లభించినను మంత్రము చెప్పి తన్త్రము చేయించే స్వాములు అందుబాటులో లేకుండుటచే కష్టంగా ఉంది.

శ్రాద్ధం, పార్వణవిధానమని, సంకల్ప శ్రాద్ధమని, హిరణ్య శ్రాద్ధం, బ్రహ్మార్పణ విధానమని అనేక రకాలుగా ఉన్నను మనం

బ్రహ్మార్పణవిధానమునే ఎక్కువగా ఆచరించుచున్నాము.

బ్రహ్మార్పణవిధానమునే భాగవత తదీయారాధనమని అంటారు. ఇందులో మంత్రం, తంత్రం ఉంది. మంత్రం వచ్చినా తంత్రం తెలియక తంత్రం తెలిసిన మంత్రం తెలియక తికమకపడుచున్నాము.

ఈ కొరతను తీర్చుతూ ఎందరో శ్రాద్ధవిధానాన్ని పుస్తకరూపంలో వెలువరించారు. అవి విస్తృతంగా ఉండడంచేత తెలుగులో వాటి వివరణం అంతగా లేకుండుట జరుగుచున్నది.

పై విషయములను దృష్టిలో ఉంచుకొని కర్తయైన వ్యక్తి ఈ విధానాన్ని తనవద్ద నుంచుకొని కొద్దికాలములోనే బ్రహ్మార్పణవిధానమును తాను స్వయంగా లేదా స్వాముల సహకారంతో నిర్వర్తించుకొనునటుల వ్రాయడం జరిగినది.

"ప్రమాదో ధీమతామపి" ధీమతులైన వారికి కూడా ప్రమాదం అనగా అనవధానత (అమరనిఘంటువు) ఉండవచ్చు.

ఆపరితోషాత్ విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానం, అన్నట్లు పెద్దలు, సహృదయులు అయిన బంధువులందరు ఇది బాగుంది అని సంతసించితేనే చేసినపని మంచిదని తలంతును.

ప్రతి సంవత్సరం మరణించిన పితరుల నుద్దేశించి ఆచరించిన ఈ శ్రాద్ధం చేత సమస్త దేవతారాధన సిద్ధించి వారి ఆశీస్సుల చేత కులాభివృద్ధి, వంశాభివృద్ధి కలుగుతుంది.

మనము సంకల్పం చేయునప్పుడు గోత్రనామోచ్చారణ చేయుచూ పితృ పితామహ ప్రపితామహానాం (అని) వసురుద్రాదిత్య స్వరూపాణాం (అంటాము) అంటే వసువులు 8, రుద్రులు 11, ఆదిత్యులు 12. కలిపితే 8+11+12=31.

విశ్వేదేవతలు 2, అంటే 33... ఒక్కరు ఒక కోటి చొప్పున ముప్పైమూడు కోట్ల దేవతలు అగుచున్నారు ఆ తర్వాత శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణువు...

ఏమైందిప్పుడు? 33 కోట్ల దేవతలు, వారందరి అంతర్యామిగా నుండి తాను మళ్ళీ స్వతంత్రుడుగా నున్న విష్ణువు. ఇంత మందిని ఆరాధించుచున్నామన్నమాట.మన సంవత్సరము దేవతలకు ఒక రోజు. అనగా శ్రాద్ధం ద్వారా ఎల్లప్పుడు సమస్త దేవతలను శ్రీమహావిష్ణువును అర్చించుచున్నాము. కావున మనకు సకల శ్రేయస్సులు కలుగును. అందువలన సంప్రదాయనిష్ఠగల వారందరు శ్రద్ధతో ఈ విధానంతో బ్రహ్మార్పణం చేసి సుఖింతురు గాక...



శ్రీమాన్ కాండూరి వేంకటరమణాచార్యులు

శ్రీమతి కాండూరి ఆండాళమ్మ



శ్రీమాన్ కాందూరి వేంకటరమణాచార్యులు
పరమపదం-(04-03-2013)

శ్రీమతి కాందూరి ఆండాళమ్మ
పరమపదం-(18-05-2017)



## కుమారులు-కోడళ్లు

శ్రీమాన్ కాండూరి శ్రీనివాసాచార్యులు -
శ్రీమతి కృష్ణవేణి

శ్రీమాన్ కాండూరి నరసింహాచార్యులు -
శ్రీమతి మధుమతి

## కుమార్తెలు-అల్లుళ్లు

శ్రీమతి సుజాత -
శ్రీమాన్ శేషం వేంకటస్వామి

శ్రీమతి లలిత -
శ్రీమాన్ శృంగారం శ్రీమన్నారాయణాచార్యులు

శ్రీమతి శ్రీలత -
శ్రీమాన్ కందాళ సీతారామాచార్యులు

శ్రీమతి సునీత -
శ్రీమాన్ గోవర్ధనం మధుమోహన్



మనుమలు - మనుమరాళ్లు

కందాళ సౌమ్యశ్రీ,

కందాళ రఘునాథ్.

కాండూరి సుమశ్రీ,

కాండూరి శ్రీకాంత్ భరద్వాజ్,

కాండూరి సౌజన్య,

కాండూరి శ్రీనిధి.

శేషం శ్రీజ,

శేషం శ్రీహర్ష.

శృంగారం సురభి,

శృంగారం సుమన.

కందాళ శ్రీనిజ,

కందాళ శ్రీహిత, కందాళ శ్రీలేఖ.

గోవర్ధనం శ్రీనివాస చక్రవర్తి,

గోవర్ధనం శ్రీవైష్ణవి.

# శ్రీవైష్ణవ శ్రాద్ధ ప్రయోగము

## బ్రహ్మార్పణ విధానము

బ్రహ్మార్పణ విధానంగా ప్రతి సంవత్సరం శ్రాద్ధం ఆచరించే విధానము.

శ్రాద్ధానికి కావల్సినవి... నువ్వులు, బియ్యం, గంధం, నెయ్యి, బ్రహ్మదండమునకు రూపాయలు మూడు, మూడు ఆకుల విస్తరి, దర్భలు, స్వాములు 3, సాలగ్రామతీర్థం, పెరుమాండ్ల తీర్థం, శ్రీపాద తీర్థం. తూర్పుముఖంగా కర్త. కలశంలో తీర్థం, విడిగా పాత్రలో తీర్థం. ఉద్ధరిణి, తర్పణ పాత్ర.

కర్త ఉద్ధరిణిలో పాత్రలోని నీళ్లు తీసుకొని 3 సార్లు ఆచమనం చెయ్యాలి.

1 ఓం కేశవాయస్వాహా, 2 నారాయణాయస్వాహా,
3 మాధవాయస్వాహా) 4 గోవిందాయనమః
5 విష్ణవేనమః 6 మధుసూదనాయనమః
7 త్రివిక్రమాయనమః 8 వామనాయనమః
9 శ్రీధరాయనమః 10 హృషీకేశాయనమః
11 పద్మనాభాయనమః 12 ధామోదరాయనమః
13 సంకర్షణాయనమః 14 వాసుదేవాయనమః
15 ప్రద్యుమ్నాయనమః 16 అనిరుద్ధాయనమః
17 పురుషోత్తమాయనమః 18 అధోక్షజాయనమః
19 నారసింహాయనమః 20 అచ్యుతాయనమః
21 జనార్ధనాయనమః 22 ఉపేంద్రాయనమః
23 హరయేనమః 24 శ్రీకృష్ణాయనమః

ఓం పృథివ్యాః మేరోః పృష్ట ఋషిః కూర్మోదేవతా సుతలం చందః ఆసనే వినియోగః

అనంతాసనాయనమః ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా దైవీగాయత్రీ ఛందః ప్రాణాయామే వినియోగః

(ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోమ్.

పవిత్రధారణం

ఇప్పుడు కర్త పవిత్రను ధరించాలి. ఆ పవిత్రను స్వాముల చేతితో ముట్టించి ఈ క్రింది మంత్రమును చదువుతూ కుడిచేతి అనామిక వేలుకు ధరించాలి.

"పవిత్రవంతః పరివాజ మాసతే పితేషాం పత్నో
అభిరక్షతి వ్రతం
మహస్సముద్రం వరుణ స్తిరోదధే ధీరా ఇచ్ఛే
కృద్ధరణే ష్వారభమ్.

పునరాచమ్య (మళ్ళీ ఆచమనం చెయ్యాలి)

ఓం పృథివ్యా; మేరోః పృష్ట ఋషిః కూర్మోదేవతా సుతలం చందః ఆసనే వినియోగః అనంతాసనాయనమః ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా దైవీగాయత్రీ ఛందః ప్రాణాయామే వినియోగః

(ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

ఓం ఆపోజ్యోతిరసోమృతం బ్రహ్మభూర్భువ స్సువరోమ్.

తిథిర్విష్ణుః తథావారో నక్షత్రం విష్ణురేవచ యోగశ్చ కరణం చైవ సర్వం విష్ణుమయం జగత్!!

శ్రీ గోవింద గోవింద గోవింద (అని కర్త అనాలి)

మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయ ప్రహరార్థే శ్రీ శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే అస్మిన్ వర్తమాన వ్యవహారీక చాంద్రమానేన ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే శ్రీ.......................నామ సంవత్సరే ....... అయనే ..............ఋతౌ ..... ..........మాసే ............పక్షే ...........తిథౌ................ .....వాసరే విష్ణువాసరే విష్ణునక్షత్రే విష్ణుయోగే విష్ణుకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ...

ప్రాచీనావీతి (యజ్ఞోపవీతమును కుడిభుజం మీదకు మార్చుకోవాలి)

యజమానస్య (యజమానితో 'అస్మత్' తల్లి యైతే మాతుః అని, తండ్రియైతే పితుః అని అనిపించాలి). తండ్రియైనచో 'గోత్రోద్భవస్య' అని తల్లియైనచో 'గోత్రాయాః అని, తండ్రియైనచో వారి పేరుచెప్పి 'నామధేయస్య శర్మణః అని, తల్లి యైనచో నామధేయ్యాః అని.)

ప్రాతిసంవత్సరీక మృతాహోఖ్యాన్న శ్రాద్ధే దేహేంద్రియ గృహ భూ భాండ ఆత్మద్రవ్య స్థల శరీర శుద్ధ్యర్థం శ్రాద్ధాహదౌ ప్రాయశ్చిత్తసూక్త జాప్య మంత్రపఠనం కరిష్యే. (అని నువ్వులు తీసుకొని ఉద్ధరిణితో నీళ్లను తర్పణపాత్రలో విడువాలి)

తతః సవ్యేన యహోదక మహం కరిష్యే (అంటూ యజ్ఞోపవీతమును ఎడమ భుజం పైకి

మార్చుకొని బియ్యంతో నీళ్లు వదలాలి. మళ్లీ యజ్ఞోపవీతమును కుడిభుజం పైకి మార్చుకొని నువ్వులతో నీళ్లు వదలాలి)

అపసవ్యేన తిలోదకమహం కరిష్యే.

(యజ్ఞోపవీతమును మళ్లీ సవ్యం చేసుకొని, సవ్యేన కలశారాధనం కరిష్యే అని నీళ్లు విడువాలి)

చెంబులో నీళ్లు నింపి

"ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రిస్తోమగ్ం స చ తాపరుష్ణియా అశిక్నియా మరుద్వృతే వితస్తయార్జీకియే శృణుహ్యా సుషోమయా!! (అంటూ అరచేయి చెంబుపై ఉంచాలి పిదప)

గంధద్వారామితి మంత్రేణ (కలశంలో గంధం వెయ్యాలి)

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం

ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వామిహో పహ్వయే శ్రియమ్!!

యవోసీతి మంత్రేణ (బియ్యం కలశంలో వెయ్యాలి)

యవోసి ధాన్యరాజోవా వారుణో మధు సంయుతః

నిర్ణోధ స్సర్వ పాపానాం పవిత్రం ఋషిభిః స్మృతమ్.

ప్రాచీనావీతి (యజ్ఞోపవీతమును కుడిభుజం పైకి

మార్చి) తిళోసీతి మంత్రేణ (నువ్వులు కలశంలో వెయ్యాలి) తిలోసి సోమదేవత్యో గోసవో దేవనిర్మితః ప్రత్నవద్భిః ప్రత్నవ స్స్వధ ఏహి. (సవ్యం చేసుకొని)

దర్భలను కలశంలో వెయ్యాలి, కూర్చనైనా వేయవచ్చు.

'కాండాత్ కాండాత్ ఇతి మంత్రేణ'

కాండాత్ కాండాత్ ప్రరోహంతి పరుషః పరుషః పరి ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ, యా శతేన ప్రతనోషి సహస్రేన విరోహసి తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్. కూష్మాండైః జుహుయాత్! యో పూత ఇవ మన్యేత! యదాస్తేనో! యదా భ్రూణ హైవ మేష భవతి! యో యోనౌ రేతస్సించతి! యదర్వాచిన మేనో బ్రూణ హత్యాయాః తస్మాన్ముచ్యతే! యావదేనో దీక్షా ముపైతి! దీక్షిత ఏతైః సంతతిర్జుహోతి! సంవత్సరం దీక్షితో భవతి. సంవత్సరాదేవ ఆత్మానం పునీతే- మాసం దీక్షితో భవతి- యోమానస్య సంవత్సరః సంవత్సరాదేవ ఆత్మానం పునీతే- చతుర్విగ్ంశతి రాత్రీర్దీక్షితో భవతి- చతుర్విగ్ంశతి రర్ధమాసాః సంవత్సరః సంవత్సరాదేవ ఆత్మానం పునీతే!

ద్వాదశ రాత్రీర్దీక్షితో భవతి- ద్వాదశ మాసాః సంవత్సరః సంవత్సరాదేవ ఆత్మానం పునీతే-

షడ్రాత్రీర్దీక్షితో భవతి- షడ్వా ఋతవ స్సంవత్సరః సంవత్సరాదేవ ఆత్మానం పునీతే-

తిస్రో రాత్రీర్దీక్షితో భవతి- త్రిపదా గాయత్రీ- గాయత్ర్యా దేవ ఆత్మానం పునీతే-

నమాగ్ం నమశ్శియాన్నస్త్రియము పేయా

న్నో పర్యాసీత జుగుప్సేత అనృతాత్ప్రయో బ్రాహ్మణస్య వ్రతం- యవాగూ రాజన్య స్యామిక్షా వైశ్యస్యాథో సౌమ్యేప్యధ్వరః - ఏతద్వ్రతం బ్రూయాద్యదిమన్యే తోపదా స్యామీ త్యోదనం ధానాః సక్తూన్ ఘృత మిత్యను వ్రత మేదాత్మనో అనుపదాసాయ-

(పిదప కర్త ఉద్ధరిణితో కలశంలోని నీళ్లు తీసుకొని ఎడమచేత పట్టుకొని కుడిచేత ఒక దర్భపుల్ల తీసుకొని నెత్తిపైన ఈ క్రింది మంత్రం చదువుచుండగా చల్లుకొనుచుండవలెను)

## మార్జనమ్

శుచీవో హవ్యా మరుతశ్శుచీనాగ్ ం శుచిగ్ ం హినో ప్యధ్వరగ్ ం శుచిభ్యః- ఋతేన సత్యం ఋత సాపఆయన్ శుచి జన్మానః శుచయః పావకాః అగ్ని శ్శుచిః వ్రతతమశ్శుచిః విప్రశ్శుచిః కవిఃశ్శుచీ రోచత ఆహుతః - ఉదగ్నే శుచయః తవ శుక్రా భ్రాజంత ఈరతే - తవ జ్యోతీగ్ ం ష్యర్చయః ఏతోన్వింద్రం స్తవామ శుద్ధం శుద్ధేన సామ్నా - శుద్ధైరుక్థైర్వా వృధ్ధాంసం - శుద్ధ ఆశీర్వాం మమత్తు- ఇంద్రశ్శుద్ధోన ఆగహి - శుద్ధః శుద్ధాభి రూతిభిః శుద్ధోరయిం నిధారయ- శుద్ధో మముగ్ధి సౌమ్యః- ఇంద్రః శుద్ధో హి నోరయిం. శుద్ధో రత్నాని దాశుషే- శుద్ధో వృత్రాణి జిఘ్నసి- శుద్ధో వాజం శిషాససి.

(పిదప ఆ నీరు విడిచిపెట్టి ఉద్ధరిణితో నీళ్లు మళ్లీ తీసుకొని స్వాముల చేతికి దర్భలనిచ్చి అరచేతిలో పెట్టుకొని తలవంచి నీళ్లను కర్త తన శిరస్సుపై చల్లించుకొనవలెను. ఈ క్రింది మంత్రము చదువుతూ)

బ్రాహ్మణేష్వమృతగ్ ం హితం- యేన దేవాః పవిత్రేణ ఆత్మానం పునతే సదా- తేన సహస్రధారేణ పావమాన్యః పునంతు మా- ప్రాజాపత్యం పవిత్రం - తతోద్యామగ్ ం హిరణ్మయం తేన బ్రహ్మవిదో వయం- పూతం బ్రహ్మపునీమహే- ఇంద్రస్సునీతీ సహమా పునాతు- సోమస్స్వత్యా వరుణస్సమీచ్యా - యమో రాజా ప్రమృణాభిః పునాతు మా జాతవేదా మూర్జయం త్యా పునాతు.

**(నీళ్లు చేతిలో పోసుకొని కర్త ఈ క్రింది మంత్రం చదువుచుండగా అంతట చల్లుచుండవలెను)**

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోపివా
యః స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరః శుచిః!!

సర్వాణి స్థలాని శుచీని భవంతు- సర్వాణి ద్రవ్యాణి శుచిర్భవతు- ఆత్మనః అశేష పాపక్షయార్థం బ్రహ్మదండమాచరిష్యే

**(పై వాక్యమును కర్త పలుకవలెను)**

## తిల దర్భ హిరణ్యాం గృహీత్వా

**(నువ్వులు, దర్భలు, రూపాయలు కర్త తీసు కోవాలి యజ్ఞోపవీతమును పేరువలె వేసుకొని, స్వాముల చుట్టూ మూడు ప్రదక్షిణలు చెయ్యాలి ఈ క్రింది మంత్రమును ఉచ్చరించుతూ)**

సమస్త సంపత్ సమవాప్తి హేతవః
సముత్థితాపత్కుల ధూమకేతవః
అపార సంసార సముద్ర సేతవః పునంతు త్వాం **(మాం అని కర్త అనాలి)** బ్రాహ్మణ పాద పాంసవః-
ఆపద్ఘన ధ్వాంత సహస్ర భానవః

సమీహితార్పణ కామధేనవః

సమస్త తీర్థాంబు పవిత్ర మూర్తయః ంక్షంతు త్వాం (మాం అని కర్త) బ్రాహ్మణ పాద పాంసవః!!

విప్రౌఘ దర్శనాత్ క్షిప్రం క్షీయతే పాపరాశయః వందనాత్ మంగళావ్యాప్తిః అర్చనాత్ అచ్యుతం పదమ్!!

అధివ్యాధిహరం నృణాం మృత్యుదారిద్ర్య నాశనం
శ్రీః పుష్టిః కీర్తిదం వందే విప్రశ్రీపాద పంకజమ్!!

యావతీర్వై దేవతాః తాస్సర్వాః వేదవిది బ్రాహ్మణేవసంతి

తస్మాత్ బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే నమస్కుర్యాత్
న అశ్లీలం కీర్తయేత్ ఏతాః ఏవ దేవతాః ప్రీణాతి-

నమో దేవేభ్యః స్వధా పితృభ్యః ప్రాచీనావీతి (యజ్ఞోపవీతమును మార్చి) యజమానస్య (అస్మత్ కర్త అనాలి) తండ్రియైనచో (పితుః) తల్లియైనచో (మాతుః) గోత్రస్య (గోత్రాయాః) శర్మణః (తండ్రి పేరు చెప్పాలి) తల్లియైతే (దాయ్యాః) వసురూపస్య ప్రాతి సాంవత్సరీక వ్మృతాహాఖ్యాన్నశ్రాద్ధం కర్తుం (యజమాని 'మమ' అనాలి) అధికార సంపదస్తు ఇతి భవంతో భృవంతు.

(స్వాములు 'తవ అధికార సంపదస్తు' అనాలి) యజ్ఞోపవీతమును ఇటువైపు, అటువైపు త్రిప్పుకోవాలి.

(కర్త అనాలి) - కాలశ్చ ముఖ్యఃకాలోస్తు ఇతి భవంతో భృవంతు

(భోక్తలు అనాలి) - కాలశ్చ ముఖ్య కాలోస్తు-

(కర్త) సంపాదితానాం పాకాదీనాం పవిత్రతాస్తు ఇతి భవంతో భృవంతు-

(భోక్తలు) సంపాదితానాం పాకాదీనాం పవిత్రతాస్తు....సర్వే పాకాః శుచయో భవంతు.

కర్త (తిలలు ఉత్తరం వైపు చల్లి గయను స్మరించుచూ) 'గయేయం గయేయం గయేయం' అనాలి

శ్రాద్ధకాలే గయాం ధ్యాత్వా ధ్యాత్వా దేవం జనార్దనమ్

వస్వాదీన్ శ్చ పితౄన్ ధ్యాత్వా తతః శ్రాద్ధం ప్రవర్తయే!!

భోక్తలు - ప్రవర్తయ అనాలి

(యజమాని సవ్యంగా ప్రాణాయామం చెయ్యాలి)

పూర్వోచ్ఛరిత ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ

ప్రాచీనావీతి (అపసవ్యంగా జందెం వేసుకోని)

యజమానస్య (అస్మత్ కర్త అనాలి) పితృ-పితామహ-ప్రపితామహానాం- తండ్రి-తాత-ముత్తాత (తల్లియైనచో మాతృ-పితామహి-ప్రపితామహీనాం) ....... .............. గోత్రాణాం ........ శర్మాణాం వసు రుద్రాదిత్య స్వరూపాణాం (తల్లియైనచో ............ గోత్రాణాం......దాయీనాం....)తల్లి నానమ్మ ఆమె అత్త -

సవ్యం (జందెము సవ్యం చేసుకొని) పురూరవ ఆర్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం శ్రాద్ధ సంరక్షక శ్రీమహావిష్ణుం చ ఉద్దిశ్య (కర్త మయా (భోక్తలు) త్వయా క్రియామాణేన 'అస్మత్' యజమానస్య (పితుః / మాతుః) ప్రాతి సాంవత్సరీక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం అన్నేన బ్రహ్మార్పణ విధానేన సదైవం యుగపదద్య కరిష్యే (కర్త అనాలి) 'కురుష్వ' భోక్తలు అనాలి)

## క్షణ ప్రదానమ్

(సవ్యంగా ఉండి బియ్యం, దర్భలు తీసుకొని విశ్వేదేవరులకు క్షణం ఇవ్వాలి) పురూరవ ఆర్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం స్థానే ఆహవ నీయార్థే క్షణం దత్వా (కర్త అనాలి)- భవద్భిః క్షణ ప్రసాదః కరణీయః అని) భోక్త 'అస్తు కరణీయః' అనాలి.

(ప్రాచీనవీతి) కర్త అపసవ్యం చేసుకొని నువ్వులు దర్భలు తీసుకొని)

యజమానస్య (అస్మత్) పితృ-పితామహ- ప్రపితా మహానాం-........... గోత్రాణాం...... శర్మాణాం తండ్రి పేరు తాత ముత్తాతల పేర్లు, గోత్రం చెప్పాలి) (మాతృ పితామహి ప్రపితా మహీనాం) తల్లి పేరు నానమ్మ పేరు ఆమె అత్త పేరు చెప్పాలి) వసు రుద్రాదిత్య స్వరూపాణాం స్థానే ఆహవనీయార్థే క్షణం దత్వా భవద్భిః క్షణ ప్రసాదః కర్తవ్యః అని కర్త అనాలి) 'సుకర్తవ్యః (అని క్షణం తీసుకొన్న స్వామి చెప్పాలి)

సవ్యం శ్రాద్ధ సంరక్షక శ్రీమహావిష్ణోః స్థానే ఆహవనీయార్థే క్షణం దత్వా (బియ్యం, దర్భలు స్వామికివ్వాలి) భవద్భిః క్షణ ప్రసాదః కరణీయః (కర్త అనాలి) 'అస్తు కరణీయః' (అని స్వామి అనాలి).

(కర్త భోక్తలతో అనాలి)

అక్రోధనైః శౌచపరైః సతతం సత్య వాదిభిః భవితవ్యం భవిద్భిః చ (మయాచ) శ్రాద్ధకర్మణి శ్రాద్ధకర్మ కరిష్యే (కర్త అనాలి)

(కురుష్వ అని భోక్త అనవలెను) 3 ఆకుల అంటలో బియ్యం, దర్భలు, నువ్వులు, గంధం, నెయ్యి తీసుకోవాలి

మంత్రమధ్యే క్రియామధ్యే విష్ణోః స్మరణ పూర్వకం
యత్కించిత్ కురుతే కర్మ తత్కోటి గుణితం భవేత్!!
కలౌ కలికృతాన్ దోషాన్ ద్రవ్య దేహాత్మ సంభవాన్
సర్వాన్ హరతి చిత్తస్థః భగవాన్ దేవకీసుతః!!

విష్ణుః విష్ణుః విష్ణుః

దేవపూర్వక మండలాద్యర్చనం కరిష్యే- (కర్త అనాలి) సవ్యంగా కూర్చుండి కాళ్లు కడిగే స్థలంలో

మండలార్చన: కర్త తూర్పుముఖంగా ఉండి చేయాలి. భూమిం గోమయేన ఉపలిప్య- గృహాంగణే పూర్వ దిగ్భాగే ప్రాఙ్ముఖం ఉపవిశ్య ప్రాదేశమాత్రం ఉత్తరతః దేవపాద్యస్థానే చతురశ్ర మండలం కృత్వా- (ఉత్తరభాగంలో నాలుగు మూలలు ఆవుపేడతో లేదా తులసిచెట్టు మొదలు లోని మట్టితో అలుకవలెను.)

దేవపాద్య స్థానే అయం గంధః- (గంధం భూమిపై చిలకరించాలి)



ఇమే యవాః - (యవలు లేనిచో బియ్యం వెయ్యాలి)

ఇమే ప్రాగగ్రాన్ దర్భాన్ పరిస్తీర్య (దర్భలు మండలంపైన వెయ్యాలి)

అష్టార్ఘ్యైః సంపూర్ణార్చనమస్తు- (నీళ్లు అరచేతితో విడువాలి)

(జందెము అపసవ్యం చేసుకొని దక్షిణభాగంలో 6 అంగుళాలు మధ్య ఎడం ఉండునట్లు స్థలం విడిచి పితృపాద్య స్థానంలో గుండ్రంగా మండలం చెయ్యాలి)

దక్షిణతః పితృపాద్య స్థానే వర్తులాకార మండలం కృత్వా పితృపాద్య స్థానే అయం గంధః- ఇమే తిలాః- ఇమే దక్షిణాగ్రాః కుశాః - అష్టార్ఘ్యైః సంపూర్ణార్చనమస్తు- (గంధము, నువ్వులు దక్షిణాగ్రములుగా దర్భవేసి చేతిబొటన వేలుతో నీళ్లు మండలంపై విడువాలి)

1) (పిదప సవ్యంగా మొదటి మండలం పైకి విశ్వేదేవతలను ఆహ్వానించాలి. కర్త పడమటి ముఖంగా స్వామి తూర్పుముఖంగా ఉండాలి. బియ్యము, దర్భలు స్వామిపాదాలపై ఉత్తర సమాప్తిగా వెయ్యాలి)

"మండలాత్ పశ్చిమభాగే స్వాగతంతు విధీయతే

తత్రైవ పాద్యం దద్యాచ్చ క్షాలనం మండలోపరి-

పురూరవ ఆర్ద్రవ సంజ్ఞకాః విశ్వే దేవాః స్వాగతం సుస్వాగతం (ఇతి దర్భ అక్షతాన్

ఉత్తరతః ప్రక్ష్య) 
ఇదంవో అర్ఘ్యం (అంటూ చేతికి నీళ్లు ఇవ్వాలి) ఇదం వః పాద్యం సుపాద్యం (కాళ్లపైన నీళ్లు చల్లాలి) (కొందరు పాద్యం ఇచ్చిన తర్వాత అర్ఘ్యం ఇస్తారు.) హస్తయోః అర్ఘ్యం- అస్తు అర్ఘ్యం (ఇతి హస్తే అపఃప్రదాయ) చేతికి నీళ్లిచ్చి,

కర్త తన కుడిచేతికి ఉన్న పవిత్రను తీసి కుడిచెవిసందున అర్పించి మోకాలు వరకు లేదా పిక్కలవరకు కాళ్లు కడుగవలెను.

శంనో దేవీరభిష్టయ ఆపో భవంతు వీతయే శం
యో రభిస్రవంతునః- చరణం పవిత్రం వితతం
పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని తేన
పవిత్రేన శుద్ధేన పూతాః అతి పాప్మానం
అమరాతిం తరేమ (పిదప కర్త తన చేయి కడుగుకొని పవిత్రను ధరించి స్వామిపాదాల బొటనవ్రేళ్ల పైన నేయి వ్రాయాలి)

(స్వహస్తౌ ప్రక్షాళ్య పవిత్రం ధృత్వా
పాదాంగుష్ఠయోః ఆద్య లేపనం కృత్వా)

శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవి తోత్పునాతు- అచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః
నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయచ
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః (నీళ్లను యజమాని తన తలపై చల్లుకోవాలి)

ప్రాచీనావీతి (జందెము ఎడమవైపు మార్చి)

2. (పితృక్షణం తీసుకున్న స్వామిని దక్షిణం వైపు ఉండే

మండలం పైకి ఆహ్వానించి నువ్వులు, దర్భలు తీసుకొని కర్త ఇలా అనాలి



యజమానస్య (అస్మత్) పితృ- పితామహ-
ప్రపితా మహానాం- ............... గోత్రాణాం ........
శర్మాణాం స్వాగతం సుస్వాగతమ్-

(నువ్వులు, దర్భలు స్వామిపాదాలను తుడుస్తూ దక్షిణం వైపు వెయ్యాలి)

(మొదటి విశ్వేదేవతలకు వలెనే మంత్రం, తంత్రం చెయ్యాలి)

ఆ పిదప కర్త జందెమును సవ్యం చేసుకొని బియ్యం, దర్భలు చేతపట్టి దక్షిణం నుండి ఉత్తరం వైపు వెయ్యాలి. స్వామిని మండలంపైకి పిలిచి)

3. శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే, శంఖ చక్ర గదాధరాయ శ్రీ లక్ష్మీసమేతాయ, గరుడవాహనా రూఢాయ స్వాగతం -సుస్వాగతం-

(బియ్యం తరువాత దర్భలను ఉత్తరం వైపు
వెయ్యాలి పాదాలపై నుండి)

చేతికి నీళ్లు అర్ఘ్యం, పాదాలకు నీళ్లు పాద్యం ఇవ్వాలి. పవిత్ర తీయాలి.

శంనో దేవీ రభిష్టయ........

చరణం పవిత్రం....... అను మంత్రములతో కాళ్లు కడిగి పవిత్ర ధరించి కాళ్లబొటనవ్రేళ్లుపై నేయి వ్రాసి ఎడమచేత నీళ్లు పోస్తూ కుడి అరచేయిని బొటనవ్రేళ్లు

క్రింద పెట్టి కాళ్ళు కడిగిన నీళ్లు నెత్తిపై చల్లుకోవలెను.)


కర్తా స్వస్య పాదౌ ప్రక్షాళ్య మండలోత్తరే ఆచమ్య, విప్రాన్ ఆచమయ్య్య, పవిత్రం ధృత్వా-

(యజమాని తన కాళ్లుకూడా కడుగుకొని మండలమునకు ఉత్తరం వైపు ఆచమనం చేసి, స్వాములను కూడా ఆచమనం చేయించి ఆ తరువాత పవిత్రను ధరించాలి. అంతేగాని తాను ఆచమనం చేయునప్పుడు పవిత్రను ధరించ కూడదు) 3 ఆకుల అంటను రెండుమండలాల మధ్యన బోర్లించి నీళ్లు చల్లి తిరిగి వెల్లవెలుకల వేసి నీళ్లు పోయాలి.

ఇప్పుడు కొందరు.... స్వాములను గంధ పుష్ప ధూప దీప ఫల తాంబూలములచేత అర్చింతురు. మొదట సవ్యంగా విశ్వేదేవతలను అపసవ్యంగా పితృదేవతలను, మళ్లీ సవ్యంగా విష్ణువును పూజింతురు)

## అర్చన విధానం:

భోక్తల పాదప్రక్షాళనమైన పిదప కొన్ని ప్రాంతాలలో అర్చన చేస్తారు. ఆవిధానమును సంగ్రహంగా
కర్త శుద్ధమైన తీర్థం, గంధం, ధూపం,దీపం, పుష్పములు, తులసీదళములు, పండ్లు, తాంబూలము, దక్షిణలు సిద్ధంగా ఉంచుకొని మొదట విశ్వేదేవతలను పిదప పితృదేవతలను మళ్లీ విష్ణువును అర్చించవలెను.

ఆ విధానం



కర్త యజ్ఞోపవీతమును సవ్యంగా ఉంచుకొని

1. పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాం ఇదమాసనం సుఖాసనం, ఆస్యతాం ధర్మోసి ఆపః విశ్వేదేవైః క్షణః క్రియతాం ఓం తథా ప్రాప్నువంతు భవంతః (ప్రాప్నువామః)

విశ్వేదేవతకు దర్భాసనం వేసి చేతికి నీరిచ్చి బియ్యం దర్భలు ఇవ్వాలి. అర్ఘ్యస్థానే సంకల్పః (చేతికి అర్ఘ్యం)

అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత అర్చంతు పుత్రకాః ఉతపురన్నదృష్ణ్వర్చత- (బియ్యం శిరస్సుపై వెయ్యాలి)

గంధద్వారాం ......శ్రియమ్!! (అంటూ గంధం పూయాలి)

"ధూరసి ధూర్వ ధూర్వంతం ధూర్వతం యోస్మాన్ ధూర్వతి తం ధూర్వయం వయం ధూర్వా మస్మిన్ దేవానామసి అయంవో ధూపః సుధూపః (అంటూ అగరువత్తులు వెలిగించి ధూపం చూపాలి)

ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నం నిర్ ఋతిం మమ! పశూగ్ంశ్చ మహ్యామావహ జీవనంచ దిశోదశ!! అయంవో జ్యోతిః సుజ్యోతిః (అంటూ హారతికర్పూరదీపం చూపాలి)

-సుపుష్పాణి ఇమాని తులసీదళానిచ (అని మాలికలు తులసి ఇవ్వాలి)

-ఆయుతే పరాయణే దూర్వారోహంతు

పుష్పిణీః హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహాఇమే! (పువ్వులిచ్చు మంత్రం)


యువాసు వాసాః పరివీత ఆగాః స ఉ శ్రేయాన్ భవతి జాయమానః!

తం ధీరాసః కవయః ఉన్నయంతి స్వాధియో మనసా దేవయంతః (అంటూ వస్త్రాల నివ్వాలి) వః ఆచ్ఛాదనార్థం పవిత్రార్థం ఇమౌ యవౌ కుశౌ (బియ్యం దర్భలు ఇవ్వాలి)

యాః ఫలినీః యా అఫలా పుష్పాయాశ్చ పుష్పిణీః బృహస్పతిః ప్రసూతాస్తానో ముంచత్వగ్ ం హసః-

(అని పండ్లు తాంబూలం దక్షిణ ఇవ్వాలి. చివరగా భోక్త చేతిలో బియ్యం నీళ్లు వదలవలెను) అర్చన సంపూర్ణం- అస్తు సంకల్పసిద్ధిరితి భవంతో బృవంతు- భోక్త 'అస్తు సంకల్పసిద్ధిః' అనాలి.

(జందెమును అపసవ్యం చేసుకొని అస్మత్ పితృ పితామహ ప్రపితామహానాం వసు రుద్రాదిత్య స్వరూపాణాం ఇదమాసనం సుఖాసనం ఆస్యతాం ధర్మోస్వ్యాపః నీళ్లు విడువాలి.

నువ్వులు దర్భ క్షణంగా ఇవ్వాలి. అర్ఘ్యం, అర్చన, గంధం, ధూపం, దీపం, పూలు, తులసి, వస్త్రములు, పండ్లు, తాంబూలం, దక్షిణలను పితృక్షణం తీసుకున్న స్వామికి ఇచ్చి చివరగా

ఇమౌ తిలౌ కుశౌ అర్చనం సంపూర్ణమస్తు' అని నువ్వులు దర్భలుతో నీళ్లు చేతిలో విడువాలి

కర్త జందెమును సవ్యం చేసుకొని విష్ణుక్షణం తీసుకున్న స్వామికి ఆసనం, చేతిలో నీళ్లు క్షణంగా బియ్యం,

దర్భలు, అర్చన, సుగంధం, ధూపం, దీపం పూలు, తులసి, వస్త్రములు, పండ్లు, తాంబూలము, దక్షిణలు అన్ని ఇచ్చి చివరగా బియ్యం, దర్భలు స్వామి చేతిలో విడువవలెను

ఆ తర్వాత సాపాటు తళిహలు ఏర్పాటు చేసుకొనవలెను

(భోజనపాత్రాసాధన భోజన స్థానమునందు అపహతాః అసురాః అను మంత్రమును ఉచ్ఛరించుతూ నువ్వులు చల్లాలి)

అపహతాః అసురాః రక్షాగ్ ం సి పిశాచాః యే క్షయంతి (చరంతి) పృథివీమను- అన్యత్రేతో గచ్ఛంతు యత్రైషాం గతం మనః

ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితర స్సోమ్యాసః-

అసుం య ఈయురవృకా ఋతజ్ఞాః తేనోఽవన్తు పితరో హవేషు!!

యజ్ఞేశ్వరో హవ్య సమస్త కవ్య భోక్తా అవ్యయాత్మా హరీశ్వరోఽత్ర- తత్సం నిధానాత్ అపయాంతు సద్యః రక్షాంస్య శేషాణ్య సురాశ్చ సర్వే (ఇతి జపిత్వా)

(భోజన స్థానమందు దర్భలను వేసి భూమిపైన కొద్దిగా నేయి వ్రాసి విశ్వేదేవులను తూర్పు ముఖంగా, పితృదేవతలను ఉత్తరముఖంగా, విష్ణువును తూర్పుముఖంగా పీఠలపై కూర్చుండ బెట్టవలెను)

(మొదట విశ్వేదేవతలకు తరువాత పితరులకు, విష్ణువునకు విస్తర్లు (తళియలు) వేసి నేయి వేయాలి.

పిదప అన్నము, పాయసము, భక్ష్యము వడ్డించాలి. పప్పు చివర వడ్డించాలి. పాయసం, నెయ్యి, పప్పు భోక్తకు కుడివైపు, గారెలు, బూరెలు ఎడమవైపు, మిగిలిన పదార్థాలు ఎక్కడైనా వడ్డించవచ్చు. అప్పములు, పచ్చళ్లు గరిటతో వడ్డించకూడదు. మిగతావి గరిటతో వడ్డించాలి)

"అన్నం చ పాయసం భక్ష్యం తదాది వ్యంజనానిచ!
అంతే తక్రాద్య సూపంచ శ్రాద్ధకాలే సదా క్షిపేత్!!
సూపంచ పాయసంచాద్యం, దద్యాత్ భోక్తుశ్చ దక్షిణే
తైలపఖ్వం తథావామే శేషేష్వనియమః స్మృతః!!
దర్వ్యా దేయం శ్రితాన్నంచ సమస్త వ్యంజనానిచ
తైలపఖ్వం అపఖ్వంచ (నూనెలో గోలించిన అప్పములు, నీటిలో ఉడకని పచ్చళ్లు) నతు దద్యాత్ కదాచన

(స్వాములకు విశ్వేదేవాది క్రమంలో వడ్డించిన విస్తరిపై చల్లుటకు మొదట కొంచెం తీర్థం ఇవ్వాలి. తర్వాత పరిషేచనం కొరకు నీళ్లు ఇవ్వాలి)

ఓం భూర్భువస్వః ఓం తత్సవితుర్వరేణ్యం......... ప్రచోదయాత్ - సత్యం త్వ ర్తేన పరిషించామీతి అమృతమస్తు అమృతోపస్తరణమసి.

(పెరుమాళ్ల తీర్థం, శ్రీపాద తీర్థం స్వాములకు ఇచ్చి మళ్లీ పెరుమాళ్ల తీర్థమును అరచేతిలో స్వాములు పట్టుకోవాలి.)

(కర్త నువ్వులు, దర్భ, యవలు లేదా బియ్యం తీసుకొని దక్షిణాభిముఖంగా నిలబడి)

తిల దర్భ యవాన్ గృహీత్వా దక్షిణాభిముఖస్తిష్ఠన్ ఏకోవిష్ణుః మహద్భూతం పృథక్ భూతాన్యశేషతః త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుక్తే విశ్వ భుగవ్యయః అనేన శ్రీవైష్ణవ తదీయారాధనేన అస్మత్ పితృరూపీ (మాతృరూపీ) జనార్దన వాసుదేవః ప్రియతాం నమమః ప్రియతో వరదో భవతు- ఇతి తీర్థం విసృజేత్-(పై మంత్రం చదువుతూ నీళ్లు విడువాలి)

(ఆపిదప పురుషులకు అనగా తండ్రిగారికై ఏర్పరిచిన చరమశ్లోకం పఠించాలి. తర్వాత మాతాపితా యువతయః...... మూర్ధ్నా.. చదవాలి. తల్లిగారి విషయంలో మాతాపితా...... మూర్ధ్నా)

పోయ్గ పూదత్త పేయాళ్వార్లవలె స్వాములను సంపాదించుకున్నాము కడుపునిండుగా సాపాటు చేసి (అనగా రాత్రి ఆకలి వేయకుండునట్లుగా) వడ్డించిన పదార్థములలో మీకిష్టమైనవి గ్రహించి కానివాటిని త్యజించండి.అని 'కర్త' చెప్పుతూ సాష్టాంగ ప్రణామములను ఆచరించవలయును.

తర్వాత నేయి వడ్డించాలి. స్వాములు ప్రాణాహుతులు ఈక్రింది మంత్రములను చదువుతూ 5 మార్లు గ్రహించాలి. ఎడమచేత విస్తరిని పట్టుకోవాలి

1. శ్రద్ధాయాం ప్రాణే నివిష్టో అమృతం జుహోమి శివోమా ఆవిశా ప్రదాహాయ ప్రాణాయ స్వాహా-

2.శ్రద్ధాయాం అపానే నివిష్టో అమృతం జుహోమి శివోమా ఆవిశా ప్రదాహాయ అపానాయస్వాహా-

3. శ్రద్ధాయాం వ్యానే నివిష్టో అమృతం

జుహోమి శివోవమా ఆవిశా ప్రదాహాయ
వ్యానాయస్వాహా-
4. శ్రద్ధాయాం ఉదానే నివిష్టో అమృతం జుహోమి శివోవమా ఆవిశా ప్రదాహాయ ఉదానాయస్వాహా-
5. శ్రద్ధాయాం సమానే నివిష్టో అమృతం జుహోమి శివోవమా ఆవిశా ప్రదాహాయ సమానాయస్వాహా-

శ్రీవిష్ణవే స్వాహా 'బ్రహ్మణి మ ఆత్మా అమృతత్వాయ'
(ఇత్యాత్మానం సవీంక్ష్య తనను తాను చూచుకోవాలి భోక్తలు)

(కర్త భోక్తలకు విన్నవించాలి)
అపేక్షితం యాచితవ్యం త్యాజ్యం చైవానపేక్షితం
ఉపవిశ్య సుఖేనైవ భోక్తవ్యం స్వస్థమానసైః
(విద్యమాన పదార్థేషు)
యద్రోచతే తద్గ్రాహ్యం యన్నరోచతే తత్త్యాజ్యం సుఖేన మౌనేన భోక్తవ్యం యథా రాత్రౌ క్షుణ్ణజాయేత తథా భుంక్త్వా అస్మాన్ రక్షణీయాః

తేనెను వడ్డించాలి (ఈక్రింది మంత్రమును జపిస్తూ గాయత్రిని జపిస్తూ)
శ్రాద్ధేహి మధుమంత్రేణ మధుదేయం ప్రయత్నతః
మధ్వలాభే జపేన్మంత్రం నోచేత్ సుధాపాన

సమమ్- Tapasya

ఓం భూర్భువస్స్వః ఓం తత్సవితుర్వరేణ్యం ..... ప్రచోదయాత్-

మధువాతా ఋతాయ తే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః మధునక్త ముతోషసి, మధుమత్ పార్థివగ్ ం రజః మధు ద్యౌరస్తు నః పితా, మధుమాన్నో వనస్పతిః, మధుమాగ్ ం అస్తుసూర్యః, మాధ్వీర్గావో భవంతు నః, ఓం మధు మధు మధు-

(కొందరు ప్రాణాహుతులకు ముందే పై మంత్రంతో తేనెను విస్తర్లో వేయుదురు అది కూడా ఆర్య సమ్మతమే)

(ప్రాణాహుతులు భోక్తలు 5 మార్లు తీసుకున్న తర్వాత వారి ఎడమచేయి విస్తరి తాకించినందున ఆ చేతికి కర్త నీళ్లు ఇవ్వాలి)

(భోక్తలు కడిగినట్లు చేతిని తడుముకోవాలి)

తతః ఏకాదశవారం గాయత్రీం జపేత్

(భోక్తలు సాపాటు చేయుచుండగా 11 సార్లు గాయత్రీ మంత్రజపం కర్త చెయ్యాలి)

అన్నసూక్తాన్ని కూడా పఠించవచ్చు.

స్వాములు సాపాటు తృప్తిగా చేసిన పిదప కర్త భోక్తలతో 'తృప్తాస్థః' అనాలి. భోక్తలు 'తృప్తోస్మి' అంటారు

పెరుమాళ్ల తీర్థమును భోక్తలకు ఇవ్వాలి.

(వాళ్లు తీర్థం పుచ్చుకొని ఉత్తరాపోశనం చేసి లేచి

చేతులు కడుగుకుంటారు.



అమృతాపిధానమసి, రౌరవే పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం అర్థినాముదకం దత్తమక్షయ్య ముపతిష్ఠతు!!

దేవాః పితరః పితరో దేవాః (అని కర్త భోక్తలకు అక్షతలనిచ్చి వారినుండి తిరిగి తీసుకొనుచూ) 'భోజన పాత్రాణ్యుచ్ఛాలయిష్యే' (అనాలి). అపుడు 'ఉచ్ఛాలయ' (అందురు) (ఆ అక్షితల బియ్యాన్ని భోక్తల విస్తళ్లలో చల్లవలెను)

## తాంబూలప్రదానం:

భోజనాః పాంతు పాంతు దక్షిణాః-

అంటూ మొదట అపసవ్యంగా పితరులకు, పిదప సవ్యంగా విశ్వేదేవతలకు, విష్ణువుకు తాంబూల దక్షిణలు సమర్పించుకోవలెను.

## ఆశీర్వాదః.....

(కర్త ఈ మంత్రంతో భోక్తలను ప్రార్థించవలెను)

దాతారో నోభి వర్ధతాం వేదాః సంతతి రేవ నః
శ్రద్ధాచ నోమావ్యగమాత్ బహుధేయంచ నోస్తు!
అన్నంచ నో బహుభవేత్ అతిథీగ్ం శ్చ లభేమహి!
యాచితారశ్చ నస్సంతు మాచ యాచిష్మ కంచన-

భోక్తలు బియ్యము తీసుకొని యజమాని తూర్పు ముఖంగా కూర్చొని ఉండగా ఈ క్రింది మంత్రముల నుచ్ఛరించవలెను.

అగ్నిరాయుష్మాన్ స వనస్పతిభి రాయుష్మాన్ తేనత్వా ఆయుషా ఆయుష్మంతం కరోమి- సోమ ఆయుష్మాన్ స ఓషధీభిరాయుష్మాన్ తేనత్వా యుషా ఆయుష్మంతం కరోమి- యజ్ఞ ఆయుష్మాన్ స దక్షిణాభి రాయుష్మాన్ తేనత్వా యుషా ఆయుష్మంతం కరోమి

బ్రహ్మ ఆయుష్మత్ తద్బ్రాహ్మణైః ఆయుష్మత్ తేనత్వా యుషా ఆయుష్మంతం కరోమి.

దేవా ఆయుష్మంతస్తే మృతేన పితర ఆయుష్మంతస్తే స్వధయా ఆయుష్మంతస్తేన త్వాయుషా ఆయుష్మంతం కరోమి.

సర్వస్యాప్త్యై సర్వస్య జిత్యై సర్వమేవ తేనాప్నోతి సర్వం జయతి.

శతం జీవ శరదో..... శతందీర్ఘమాయుః- అగ్నేయశస్విన్ య ఉచ్చైనదేవం వేద- శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి----

ఆయుః ప్రజాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖానిచ

ప్రయచ్ఛంతు తథా రాజ్యం ప్రీత్యా నృణాం పితామహాః!

(కర్త యొక్క గోత్రం అడిగి) యుష్మత్ .... గోత్రం వర్ధతాం (వంశము పేరు అడిగి) యుష్మత్ ........ వంశం వర్ధతాం స్వస్తివర్ధతాం గోత్రాభివృద్ధిరస్తు వంశాభివృద్ధిరస్తు ఇదం శ్రాద్ధం గయాశ్రాద్ధ ఫలదమస్తు!! (అక్షంతలు వెయ్యాలి)

(కర్త) అన్న శేషః కిం క్రియతాం (అనగా) (భోక్తలు) ఇష్టైః సహ భుజ్యతాం (అనాలి) మరియు ఈక్రింది మంత్రం

వాజేవాజే అవత వాజినో ధనేషు విప్రామృతా ఋతజ్ఞాః, అస్య మధ్యః పిబత మాధయధ్వం తృప్తా యాత పథిభిః దేవయానైః!!

(కర్త అనాలి)

పత్రశాకాది దానేన క్లేశితా యూయ మీదృశాః
తత్ క్లేశ జాతం చిత్తేషు విస్మృత్య క్షంతు మర్హథ!!
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం ద్విజోత్తమాః
శ్రాద్ధం సంపూర్ణతాం యాతు ప్రసాదాత్ భవతాం మమ!!

(కర్త పాదాభివందనం చేస్తూ)

అద్యమే సఫలం జన్మ భవత్పాదాబ్జ వందనాత్
అద్యమే వంశజాః సర్వే, యాతావో నుగ్రహాత్ దివమ్!!

ధన్యావయం భవత్పాద రజః పూతమిదం గృహం
అనుగ్రహాశ్చ యుష్మాభిః కృతో స్మాసు దయాళుభిః!!

-ఆసీమాంత మనుప్రవ్రజేత్ అనుప్రజామః-

(కర్త దర్భముడి విడిచి బియ్యం, నువ్వులు అన్నీ నీళ్లలో వేసి భోక్తలను ఇంటివాకిలి వరకు తీసుకువెళ్లి ప్రదక్షిణపూర్వకంగా నీళ్లు మొత్తం పారపోయాలి)

వామదేవాయ నమో, జ్యేష్ఠాయ నమః, శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః, కాలాయ నమః కల వికరణాయ నమో బల వికరణాయ నమో బలాయ

నమో బల ప్రమదనాయ నమో సర్వ భోతదమనాయ నమో మనోన్మనాయ నమః!!

సూచన:

నిమంత్రణకు అన్నదమ్ములు, తండ్రులు, సుతులు, భార్య మరణించినవారు, భార్య గర్భవతిగా నున్న భర్త, కులం చెడినవాడు- పనికిరారు.

ప్రమాణం-

నభ్రాతరౌ నియుంజీత శ్రాద్ధే పితృ సుతావపి
విదురం గర్భవంతం చ, విశిష్టమపి వర్జయేత్!!

భోక్తలైనవారు విడువవలసినవి 8 కలవు
-మళ్లీ రాత్రి భుజించుట, నడచి ప్రయాణం చేయుట, స్త్రీసంగమం, దానము చేయుట, దానం తీసుకొనుట, హోమం చేయుట.

ప్రమాణం-

పునర్భోజన మధ్వానం భారాధ్యయన మైథునం
దానం ప్రతిగ్రహం హోమం శ్రాద్ధభోక్తాష్ట వర్జయేత్!!

పార్వణవిధానంలో మంత్రం చెప్పేస్వామి బ్రాహ్మణార్థానికి కూడదు. ఆసనస్థో యదావిప్రః మంత్రముచ్చార్యతే యది, త్రయస్తే నరకం యాంతి కర్తాభోక్తా తథా పితా!!

భోక్తగా కూర్చుండి, స్వామి పిండప్రదానం చేయించినచో- యజమాని, భోక్త లైన స్వామి, పితరులు అను ముగ్గురు నరకమును పొందెదరు.

# మా అమ్మానాన్నల స్మృతిలో...



మాకందించిన సహాయ సహకారాలకు
శ్రీవైష్ణవ సేవాసమితి, అల్వాల వారికి సర్వదా కృతజ్ఞులము



## శ్రీవైష్ణవ సేవా సమితి

(రిజిష్టర్డ్ నెం.1213/2008)

శ్రీశ్రీశ్రీ సీతారామచంద్రస్వామి దేవస్థానము,
పాత అలువాల, సికిందరాబాద్-500 010

*Designed and published by N. Venugopalacharya. M:94941 62629*